శ్రీరస్తు.

# జానకీపతిశతకము.

వ్యాకరణ శిరోమణి

శ్రీమాన్ శృంగారం అయ్యమాచార్య

విరచితము

మొదటి కూర్పు 1000 ప్రతులు.

మచిలీపట్టణము,

పావనీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1924.

# పీఠిక.

—:0:—

శ్రీమహాలక్ష్మీకృపాకటాక్షసంపన్నులు పుణ్యకార్యాసక్తచిత్తులు దైవభక్తిపరాయణులునగు మహారాజశ్రీ దద్దు వేంకటసుబ్బారావుగారు, శ్రీ రుధిరోద్గారినామ సం॥ ఫాల్గున బ॥ ౧ స్థిరవారపు రాత్రి గం 2-32 ని॥ లకు చిత్తానక్షత్రయుక్త మకరలగ్నమున తమ ప్రథమపుత్రికయగు చి॥ సౌ॥ వెంకటసత్యమహాలక్ష్మమ్మకు మ॥ రా॥ శ్రీ తటవర్తి రామబ్రహ్మముగారి కుమారుఁడు చి॥ నాగపోతురావునకును, ఈ బ॥ ౨ భానువారపు రాత్రి గం॥ 2-30 ని॥లకు స్వాతీనక్షత్రయుక్త మకరలగ్నమున తమ ద్వితీయపుత్రికయగు చి॥ సౌ॥ పర్వతవర్ధనమ్మకు మ॥ రా॥ శ్రీ॥ గోరడ్ల వెంకన్నగారి జ్యేష్ఠపుత్రుఁడు చి॥ రామారావునకును పాణిగ్రహణమహోత్సవములు జరుపుసమయమున, నేత జానకీపతీశతకము నచ్చొత్తించుటకుఁ బూర్ణధనసాహాయ్య మొనర్చి తమకున్న దేవబ్రాహ్మణవరప్రసాదస్వీకరణాసక్తిని వెలిబుచ్చిరి. అట్టిదాతృత్వము, ఔదార్యము, విద్యాభిమానము, సుగుణసంపత్తియుఁగల వీరిని శ్రీరామచంద్రమూర్తి పూర్ణాయురారోగ్యైశ్వర్యయశస్సుఖంబు లొసంగుచుఁ బుత్త్రపౌత్త్రాభివృద్ధిగా నిరంతరము రక్షించుగావుత.

ఇట్లు,

శృంగారం అయ్యమాచార్యులు.

వ్యాకరణ శిరోమణి.



శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయనమః

# శ్రీజానకీపతీశతకము.



శ్రీ ఘనుఁ డను శేషముని సేవితపాదసరోజయుగ్మ సం
గరయోగనిరోధముఁ గని సద్గతిఁగానఁ గయుంటినయ్యయే
తంగముగా స్మరించెదవొ ♦ దీనదయాపరమూర్తి భక్తమం
దార దయాసముద్ర హరి ♦ దాసజనావన జానకీపతీ॥

ఉ॥ నీకరుణాకటాక్షమున ♦ నేఁటికి నిన్ను స్మరించు భాగ్యముం
నాకు లభించెనయ్య నిను ♦ నమ్మితి నీదయఁ గోరుచుంటి నీ
రాకను జూచుచుంటి నను ♦ రాగముతో ననుఁ బ్రోవుమంటి న
య్యా కరుణించి నాహృదయ ♦ మందు వసింపుము జానకీపతీ ॥ 2

ఉ॥ ఏగతి నైన నిన్ను భజి ♦ యింపఁగఁ బూనితి నేని యప్పుడే
రోగము ఘోరమోహములో ♦ రోషసుఖంబులో ముట్టడించుచుణ్
బాగుగ నుండనియ్యక న ♦ భావమునంతయుఁ బాడుసేయు న
న్నేగతిఁ జూచి కాచెదవొ ♦ యిట్టిది నాస్థితి జానకీపతీ ॥ 3

ఉ॥ శ్రీరమణీరమణ్ గలియ ♦ శ్రీరమణ్ గైకొని రాజహంస యా
నీరముఁ బ్రోసివేయుకర ♦ ణిన్ సుగుణంబులనే గ్రహించి నా
నేరములన్ దృజించి కరు ♦ ణింపు ముదారతఁ జూపు మాపను
ద్ధారక రామ భవ్యగుణ ♦ ధామ రఘూత్తమ జానకీపతీ॥ 4

ఉ॥ జన్మములందు మానవుని ♦ జన్మమె లెస్స యదెట్టులన్న నా
జన్మమునందు జ్ఞానమును ♦ జక్కఁగ నార్జనసేయవచ్చు యు
ష్మన్మహనీయశక్తిని వి ♦ చారణఁ జేసి తరింపవచ్చు నో
చిన్మయరూప రామ మృదు ♦ శీలమనోహర జానకీపతీ॥ 5

ఉ॥ భక్తులు గామరామయని ♦ పాడుచు నృత్యముఁ జేయుచుండ న
వ్యక్తసుఖంబు నాహృదయ ♦ మందుదయించెను నిన్నుఁ జూడనా
సక్తియుఁ గల్గెనీభజన ♦ సల్పఁగ వేడుకపుట్టె రామ స
ద్భక్తి నివేశ నాహృదయ ♦ పద్మమునందిడు జానకీపతీ॥ 6

ఉ॥ ఎన్ని పురాణముల్ వినిన ♦ నెన్నియొ నర్చనలైన భక్తి లే
కున్నను నెట్టివారలకు ♦ నుత్తమసిద్ధి లభింపనేర్చునే?
నిన్నెఁక నమ్మినాఁడఁ గడు ♦ నిర్మలచిత్తుని నన్నొనర్చి నీ
సన్నుతభక్తిమార్గమును ♦ జక్కఁగఁ జూపుము జానకీపతీ॥ 7

ఉ॥ భక్తులనోట రామయను ♦ పల్కులయందమృతంబులొల్కు నీ
భక్తికిఁ జాలఁ దద్దయు న ♦ పారకృపాబ్ధివి నీవు భక్తితో
శక్తికొలంది నీభజన ♦ సల్పిన భక్తవశుండ వౌదువో
ముక్తివిధానకారణ ము ♦ ముక్షుజనాశ్రయ జానకీపతీ॥ 8

ఉ॥ నిన్నొకసారి రామయని ♦ నిర్మలచిత్తముతో వచించినన్
మున్నొనరించినట్టి యఘ ♦ ముల్ నశియించును శ్రీహరీ నిరా
సన్నుతిఁ జేయుచుంటిని బరి ♦ సన్నుఁడవై కృపఁ జూడుమయ్య ని
న్నెన్నఁగ నెంతవాఁడను గరి ♦ హింపుము నామొఱ జానకీపతీ॥ 9

ఉ॥ తియ్యనితేనెలొల్కు భవ ♦ దీయకథామృతసాగరోత్థలం
దుయ్యెలలూఁగని ష్టటుల ♦ నూఁగుచునూఁగుచు నేగనేగ నే
నయ్యమృతంబుఁ ద్రావెద మ♦ హాఘములెల్ల నశించునయ్య రా
మయ్యకటాక్షముంచుముచి ♦ రాయువొసంగుచు జానకీపతీ॥ 10

ఉ॥ రామకథామృతంబు మధు ♦ రంబది గ్రోలెదు వారిపైన శ్రీ
రామకృపాకటాక్షము ని ♦ రంతరమున్ బ్రసరించు నందుచే
క్షేమముగల్గునంచును వ ♦ చింతురుభక్తులు రాఘవాభవ
న్నామసుధారసంబు రస ♦ నంబునఁజిల్కుము జానకీపతీ॥ 11

ఉ॥ చక్కెరకంటె ద్రాక్షఫల ♦ సారముకంటెను తేనెకంటెఁ జే
రెక్కనస్వాదుభక్ష్య మధు ♦ రేక్షు రసంబులకంటె శ్రేష్ఠ మౌ
చక్కని రామనామరుచి ♦ షడ్రుచులందును లేదు రామ నా
వాక్కున రామనామమును ♦ వర్ధిలఁజేయుము జానకీపతీ ॥ 12

ఉ॥ భక్తులురామకృష్ణయని ♦ పాడుచునుండ నదేమిచోద్యమో
రక్తిగనుండు శ్రోతకను ♦ రాగము పాఠకులందుఁగల్గుఁ ద
ద్భక్తిరసంబు తేటపడు ♦ భక్తులవాక్కున రామనామమే
వాక్తకభూషణం బఖిల ♦ మంగళహేతువు జానకీపతీ ॥ 13

ఉ॥ నీవరనామకీర్తనము ♦ నిన్నుఁబ్రసన్నునిఁజేయునయ్య నీ
సేవయువాంఛితార్థ ఫల ♦ సిద్ధినొసంగు భవత్పవిత్రయుః
ధీవిభవంబొసంగు భవ ♦ దీయపవిత్ర పదార్చనంబు శ్రీ
భూవనితాదిభోగపరి ♦ పూర్ణసుఖంబిడు జానకీపతీ॥ 14

ఉ॥ నిత్యము నీపదార్చనము ♦ నీపదసేవయు నీదుదాస్యముః
సత్యము పుణ్యకార్యరతి ♦ సజ్జనవృత్తియు దైవభక్తిసాం
గత్యము తుచ్ఛభోగ విము ♦ ఖత్వము శాంతము ధర్మశాస్త్రపాం
డిత్యము మాత్రమిచ్చి కరు ♦ ణింపు దయాకర జానకీపతీ॥ 15

ఉ॥ శ్రీహరినామకీర్తనముఁ ♦ జేయ నశించును సర్వపాపముల్
మోహలతాదిబంధనము స ♦ మూలముగాఁ దెగిపోవు నందుచే
దేహము నిర్గమింపఁ గడ ♦ తేరుపథంబు తనంత చేకుఱున్
గా హితవైఖరుల్ పడయఁ ♦ గాఁ గరుణింపుము జానకీపతీ॥ 16

ఉ॥ ఈదినమందుఁ జేయు నదె ♦ యెల్లియుఁ గ్రిమ్మఱఁ జేయుచుండి మో
హాదులఁ జిక్కి కాలమును ♦ వ్యర్థముగా నొనరించి యెట్లొ నీ
పాదములాశ్రయించి భవ ♦ బాధము వీడఁగ వేఁడుచుంటి నో
హో దయఁ జూపరాదె? పురు ♦ హూతవచోనుత జానకీపతీ॥ 17

ఉ॥ కాళ్లను ఘల్లుఘల్లనుచు ♦ గజ్జెలు మ్రోఁగుచు నుండఁ జంబులన్
వేళ్లనమీటి తాళముల ♦ వేయుచు నృత్యముఁ జేయుచున్ వడిన్
మోళ్లుచిగుర్ప గ్రావచయ ♦ ముల్ గఱఁగంగ నసోరునొవ్వఁగా
నాళ్లలయంగఁ బాడుచుఁ గ ♦ నందగు నిన్నొగి జానకీపతీ॥ 18

ఉ॥ నన్నొకసారి బ్రోవుమని ♦ నమ్మి భజించెదు నాదు భక్తులన్
మన్ననఁ జేసి బ్రోతు నభి ♦ మానముతో నని చెప్పి తిప్పు ని
న్నిన్నివిధంబులం దఱచి ♦ యెన్నుచునుంటిఁ బరాకదేల ? నా
విన్నపమాలకించుచుఁ బ ♦ విత్రునిఁ జేయుము జానకీపతీ॥ 19

ఉ॥ ఎప్పుడు నీపదాబ్జముల ♦ నెంచి భజింపఁగఁ బూనుకొంటినో
యప్పుడె నాదు పాపచయ ♦ మంతయు వీడెఁ గదయ్య యింక నీ
గొప్పతనంబుఁ జూపి నినుఁ ♦ గొల్చెడు భక్తుని నన్నుఁ బ్రోవఁగాఁ
దప్పదు భక్తరక్షణమె ♦ ధర్మము నీకగు జానకీపతీ॥ 20

ఉ॥ నాలుక నిన్ వచింప శ్రవ ♦ ణంబులు నీకథ లాలకింప నా
కాలము భక్తితోఁ జనఁగఁ ♦ గన్నులు నిన్నుఁ గనంగఁ గాళ్లు దే
వాలయముల్ చొరంగ సక ♦ లాంగములు న్నినుఁ గొల్చుచుండ నా
శీలముఁ బాగుచేసి కృప ♦ సేయుము వేఁడితి జానకీపతీ॥ 21

ఉ॥ నీయభిషేకతీర్థమును ♦ నిర్మలమౌ తులసీప్రసాదమున్
బాయనిదైవభక్తియు శు ♦ భప్రదమౌ పదపద్మసేవయున్
శ్రేయమొసంగుదాస్యమును ♦ శ్రీకరమౌ భవదీయ నామమున్
నాయఘముల్ నశింపఁ గరు ♦ ణన్ సతతంబిడు జానకీపతీ॥ 22

ఉ॥ చెప్పఁగవచ్చు ధర్మములు ♦ చేయుట సాగదదేమికర్మమో!
తప్పనితోఁచినన్ మఱల ♦ జాలనచేయఁగ బుద్ధిపుట్టు నీ
వెప్పుమునాదు దోషముల ♦ నెంచకుమీ సముద్రోవనీకిఁకన్
దప్పదు నీపదాశ్రితుల ♦ తప్పుటఁబుంపవె జానకీపతీ? ॥ 23

ఉ॥ ఏనిముసంబులోన నెవఁ ♦ డెట్టిచరిత్రము నెవ్వి సేయునో
వానినిఁ జిత్రగుప్తుఁడొగి ♦ వ్రాయుచునుండుఁ దుదిన్ యముండు నా
నానతినీయఁ గాంచుటు ♦ లాతినికిందగు శాస్తిఁ జేయు నా
రేనుసహింపఁజాలనది ♦ యెట్టులఁ గ్రోతునో జానకీపతీ! ॥ 24

ఉ॥ చేసినదానిఁబట్టి విధి ♦ సృష్టిని మోమున మూఁడుపంక్తులన్
వ్రాసినవ్రాలు దిద్దఁగల ♦ వాఁడు జగంబుల లేడు రామ నీ
వా సకలంబు మార్చుటకు ♦ సర్వుఁడవయ్యు మహాప్రభావ నే
దోసిలియొగ్గి వేఁడికొన ♦ దుర్గతిఁబాపవో జానకీపతీ?॥ 25

ఉ॥ ఆయువునూఱువత్సరము ♦ లందుసగంబును నిద్రమింగు లేఁ
బ్రాయములోసఁగొంత స్థవి ♦ రత్వములో నొకకొంత వ్యర్థమై
పోయెడు సస్యకాలమునఁ ♦ బొట్టకునై కడునీచవృత్తులన్
జేయవలెన్ గదా! నినుభ ♦ జించుటయెన్నఁడో జానకీపతీ!॥ 26

ఉ॥ మంచికిబుద్ధిపోదు చెడు ♦ మార్గములన్ జొరునింద్రియావళిన్
వంచిజయింపశక్తిగల ♦ వాఁడనుగాను సుస్థిరా త్వదంఘ్రులం
దంచితభక్తి నాకొసఁగు ♦ మవ్యయ భవాబ్ధిఁదరించి మోక్షముం
గాంచెద నింతయేని యుప ♦ కారముసేయుము జానకీపతీ?॥ 27

ఉ॥ కాలము పోయెడిన్ బ్రతుకు ♦ కాలము తగ్గెడుఁ గాన నెవ్వతే
వేళనొ పండుటాకు వలె ♦ వింతగ దేహము రాలు నక్కటా!
జాలము సేయకుండ మఱి ♦ సన్నుతపూ భవదీయనామమున్
జాలఁగ నాదు వాక్కునఁబ్రి ♦ పన్నము సేయుము జానకీపతీ॥ 28

ఉ॥ కోరినయట్లు పండితుల ♦ కున్ ధనమిచ్చి సమస్తధర్మముల్
నేరిచి కర్మముల్ జరుప ♦ నిర్గుణుఁడన్ సుమి నాదుపూర్వ సం
స్కారము చిత్తవృత్తులును ♦ సర్వవిదుండవు నీకెఱుఁగవే?
తారకనామ రామ నను ♦ ధన్యునిఁ జేయుము జానకీపతీ॥ 29

ఉ॥ బూటకమైన వేషములఁ ♦ బొందుగఁ బైకిధరించి డబ్బుకై
వాటముగాఁ బురాణముల ♦ వైఖరి దెల్పెదమంచుఁ గొందఱే
మాటలొ చెప్పుచుందు రవి ♦ మాకు రుచింపవు దేవదేవ ము
క్త్యాటిక రామనామమె స ♦ మస్తము మాకగు జానకీపతీ॥ 30

ఉ॥ వేళకు లేచి కృత్యముల ♦ వేగమె తీర్చి సహస్రకోటులన్
బాలుని కైవడిన్ దిరిగి ♦ భార్యను బిడ్డల నమ్మి వారికై
చాలినయంత రొక్కము వి ♦ శంకటవృత్తి గడింప నెంచినే
దూలితి నీదునామమును ♦ దూఱుఫలంబిది జానకీపతీ॥ 31

ఉ॥ ఎన్ని భుజించినన్ మఱల ♦ గొప్పదో మాత్రపుకీప రూపమై
యన్నియుఁ బోవుచుండుఁగద ♦ యాపను లెల్లను వ్యర్థమే కదా
నిన్ను సదా మదిన్ నిలిపి ♦ నిర్మలచిత్తముతోడఁ గొల్చుచున్
సన్నుతిఁ జేయు మార్గమె ప్ర ♦ శస్తమంబగు జానకీపతీ॥ 32

ఉ॥ ఆశకు మేర లేదు పర ♦ మార్థవిచారణయేని లేదు భూ
మీశులయాపి కానపడ ♦ యిల్లును వాకిలినిన్ ద్యజించియే
దేశము పట్టిపోయి కడు ♦ దీనుఁడనై యొరునాశ్రయింతు లో
కేశ మదీయ కష్టముల ♦ నేల హరింపవు జానకీపతీ?॥ 33

ఉ॥ జీవితకాలమున్ నిరర్థ ♦ జింపక వ్యర్థముగా నొనర్చితిన్ !
దావకనాదు కీర్తన సు ♦ ధన్ గృపఁజేసితివేని దానినే
ద్రావిథవత్కటాక్షమున ♦ ధన్యుఁడనయ్యెద నీమపాదరా
జీవములాశ్రయించితిని ♦ శ్రీరఘునాయక జానకీపతీ ॥ 34

ఉ॥ కంటిని రెప్ప యేగతిని ♦ గాచుచునుండునొ యట్లురామనా
వొంటనుండి యెల్లపుడు ♦ వేయివిధంబులఁ గావుమయ్య నీ
కంటెను రక్షకుండిల నొ ♦ కండును లేడని స్పష్టమయ్యెవే
తుంటరిపోకడల్ తొలఁగు ♦ త్రోవలఁజూపుము జానకీపతీ ॥ 35

ఉ॥ కాయము నిందిరియంబులును ♦ గట్టిగనుండెడుకాలమందె నా
రాయణపాహిపాతకహ ♦ రాయనిపల్కఁగ బోధఁజేసి గా
మాయను మంత్రముం హృదయ ♦ మందుననాటుచు రామనామపా
రాయణఁజేయుబుద్ధిని ని ♦ రంతర మియ్యుము జానకీపతీ ॥ 36

ఉ॥ నాటకమాడుభంగి భువ ♦ నంబున మర్త్యులు పుట్టి బాల్యమం
దాటలనాడి వ్యర్థముగ ♦ యౌవనమందు రమించి వృద్ధులై
కాటికి గాల్లసాచియు న ♦ గాధపుచింతఁగృశింతురో జగ
న్నాటకసూత్రధారి కరు ♦ ణాననఁబ్రోవుము జానకీపతీ ॥ 37

ఉ॥ నాటకమందుఁ బాత్రలు తు ♦ ణత్వము మొక్కొక పాత్రతోడఁ బె
క్కాటలనాడుచుం యువని ♦ కాంతరభూమికిఁ బోవ్వకై వడిన్
బోటులు పూరుషుల్ గలసి ♦ భోగపరాయణులై నటించినా
పూఁటనె సర్వముం విడిచి ♦ పోయెదరక్కట జానకీపతీ ! ॥ 38

ఉ॥ ఎందును బొందనట్టి బ్రతు ♦ కేల ? వృథాశ్రమనొందనేల ? యా
నందముదోఁచకుండె బహు ♦ జన్మజరామరణాది బాధలన్
బొందుటజాలుఁ గావుమిఁక ♦ పుణ్యజనాభయదానదీక్ష గో
విందభవత్పదాబ్జముల ♦ వేఁడుచునుండెద జానకీపతీ ॥ 39

ఉ॥ ఎత్తితి నెన్నిజన్మములొ ♦ యెన్నిశ్రమల్ పడియుంటినో మహా
పత్తులనెన్ని పొందితినొ ♦ పాడుభవంబున సౌఖ్యమున్నదే ?
యిత్తరినైన నిన్ను భజి ♦ యించి తరింపఁగఁ జేయవే ; భవా
వృత్తివిపత్తునే ననుభ ♦ వింపఁగఁజాలను జానకీపతీ ॥ 40

ఉ॥ జీవితయాత్రయందుఁ బలు ♦ చిక్కులువచ్చును గాలచక్రమా
యేవిధమేదినిల్పినను ♦ నెల్లపుడుఁ జరియించుచుండు రా
జీవదళాక్ష సర్వముఁ ద్య ♦ జించి భవత్పదచింతనంబు నీ
సేవనొనర్పనిశ్చితిమ ♦ జీవనమియ్యవె జానకీపతీ ॥ 41

ఉ॥ ఎంతవయస్సువచ్చినను ♦ నింద్రియనిగ్రహమైన లేదు నా
కెంతయొ భాగ్యముండిన జ ♦ యింపకపోతి ధనాశనైన నా
కింతటినుండి జ్ఞానముద ♦ యించెదు రీతి ననుగ్రహించి ని
శ్చింతఁగ నీ భవాబ్ధి దరిఁ ♦ జేరఁగఁ జేయుము జానకీపతీ ॥ 42

ఉ॥ కోట్లకొలంది జీవములు ♦ క్షోణినిమున్నగు పంచభూతముల్
చెట్లును జేమలుఁ బక్షి సృ ♦ జింప యముండుహరించుచుండు వా
రిట్లొనరించుచుండ మది ♦ కేమియుఁ గోరిక యుంటినయ్యయి
ట్లిట్లనగేల ? నిన్ను శర ♦ ణంటిని గావుము జానకీపతీ ॥ 43

ఉ॥ మోహమదాదిశత్రువులు ♦ ముట్టడివేయుచు నింద్రియమ్ములన్
గేహకళత్రపుత్రముఖ ♦ కీర్తిధనాశల పాలుచేసినా
దేహముగుల్లఁజేసినవి ♦ త్రిప్పుచునున్నవి యేమిసేయుదో !
పాహియటంచు నీదుపద ♦ పద్మముఁబట్టితి జానకీపతీ ॥ 44

ఉ॥ పిన్నవయస్సునందిగిరి ♦ పెద్దలమాటలఁద్రోసి యెవ్వరే
మన్నను లెక్కసేయక మ ♦ హాదురితమ్ములఁజేసి యిప్పుడే
నిన్ను స్మరింపఁ బూనితిని ♦ నీకరుణారస వృష్టిధారలం
దెన్నఁడుస్నానమాడఁగన ♦ నిచ్చెదవో నను జానకీపతీ ॥ 45

ఉ॥ తొమ్మిదిద్వారముల్ చెముట ♦ తోఁట్లనుగల్గిన యిట్టిపచ్చితోల్
బొమ్మ నలంకరించుకొని ♦ పొంగుచుఁ గాలముఁబాడుచేసి పా
పమ్ములఁ జేసితిన్ బలిత ♦ పావనమౌ హరిభక్తి నిప్పుడే
నెమ్మదిలోన నాటితిని ♦ నీవది పెంపుము జానకీపతీ ॥ 46

ఉ॥ దారసుతాదిబాంధవుల ♦ దగ్గఱఁదీయఁగవచ్చుఁగాని సం
సారము సాగరంబువలె ♦ సాగెడు నయ్యది దుస్తరంబు త
ద్భారము దుర్భరంబు భవ ♦ బంధములూడక ముక్తి గల్గునే?
గారవముంచి నన్నికను ♦ గట్టున వేయుము జానకీపతీ ॥ 47

ఉ॥ గారడివాని మాయవలెఁ ♦ గన్పడి సర్వమునాశమొందు సం
సార మసారమంచుఁగనఁ ♦ జాలక మోహమునొందియుండుటన్
సారథిలేని గుఱ్ఱముల ♦ చాడ్పున నింద్రియముల్ చరించినన్
ఘోరవిపత్తులొందఁ బడఁ ♦ గూల్చెదుఁ బ్రోవవె జానకీపతీ ॥ 48

ఉ॥ పైక్షణమెట్టులుండునో! వి ♦ పత్తులె వచ్చునో! చావెమూఁడునో
యేక్షణమందునేమొ భవ ♦ దిచ్ఛ యెటుండునో గాన నిప్పుడే
యక్షయమౌ త్వదీయ భజ ♦ నామృతమున్ ననుఁ గ్రోలనిచ్చి పా
పక్షయమౌ విధంబుగఁ గృ ♦ పన్ ననుఁజూడుము జానకీపతీ ॥ 49

ఉ॥ తొమ్మిది పెద్దద్వారముల ♦ త్రోవలుమూయకయుండఁ బ్రాణిదే
హమ్మను పంజరంబును వి ♦ హంగము భంగిఁద్యజించుగానఁ జి
త్తమ్మునఁ దావకీనపద ♦ తామరసంబుల వేగనిల్పి సౌ
ఖ్యమ్మునుబొందఁజేయుము కృ ♦ పాకర శ్రీకరజానకీపతీ ॥ 50

ఉ॥ తానొకటిన్ దలంచునెడ ♦ దైవమువేఱుదలంచు నంచు ధీ
మానవులెల్లరున్ బలుకు ♦ మాటలు నమ్మితి రామపేర్మితో
నేనొనరించు కార్యముల ♦ నెల్లనుఁజక్కఁగ సంస్కరించి యీ
మేను తరింపఁగాఁగను మ ♦ హీయదయాకర జానకీపతీ ॥ 51

సారవిహీనమౌ పనుల ♦ నల్పుఁగ దూకుచు నింద్రియాళి నెం
పారసుఖంబులన్ దగిలి ♦ సంతసమొందుచునుందు, గాని యా
ఘోరభవాబ్ధిలో మునిఁగి ♦ కూలెడు సంగతిఁ గాన లేదు ; నా
భారమునీదెయింక హరి ♦ భక్తజనాశ్రయ జానకీపతీ ॥ 52

కూటికిగుడ్డకానపడి ♦ కొల్వొనరించుచు మానవాళికిన్
నోటినిశుద్ధిచేసెను మ ♦ నోహరరామపదంబు నామదిన్
నాటక యిట్టికీర్తి భవ ♦ నాటకమాడుచునుంటి నట్టినా
యాటలమాన్ప నీవుభజ ♦ నావృతమియ్యవె జానకీపతీ ॥ 53

ముష్టికి నష్టి లేదు ఘన ♦ మోదములొందఁగ హద్దులేదు నీ
యిష్టము రామ యెట్టుల మ ♦ హీతలమందు ననుగ్రహింతువో
భ్రష్టునిఁజేయకుండ హరి ♦ భక్తినొసంగి తరింపఁజేయుమా
శిష్టజనావనా కుజన ♦ శిక్షణ సద్గుణ జానకీపతీ ॥ 54

మందమతిన్ వివేకిని స ♦ మానదయన్ గనుచుందు వట్లనీ
వందటివాదముల్ వినుచు ♦ నన్నిమతంబులలో మెలంగుచున్
సుందరమైన నీ యాకృతులఁ ♦ జూపుచు భక్తులుచేయుసత్కృతుల్
పొందవె ? రానునేసలుపు ♦ పూజలఁ గైకొను జానకీపతీ ॥ 55

అక్కఱ వచ్చినన్ బలువు ♦ రాదినమందునఁ బల్కరింతు రా
యక్కఱదీరగానె చను ♦ మందురు పిల్చినఁ బల్కరయ్య ; నే
నిక్కముగా వచించెదను ♦ నిన్నుఁ భజించిన నీవొ భక్తులం
దెక్కువప్రేమతో సతత ♦ మింపొనరింతువు జానకీపతీ ॥ 56

ఎండకువానకోర్చి విష ♦ యేచ్ఛల నెల్లఁ ద్యజించి కానలో
నుండి తపంబుఁజేయు వర ♦ యోగులకైనను దుర్గముండవై
యుండెదు నీవు భక్తులకు ♦ నో సులభుండవు భక్తవత్సలా
ఖండితదైత్య భక్తజన ♦ కష్టవిమోచన జానకీపతీ॥ 57

ఉ॥ ప్రాణముపోవువేళ యమ ♦ పాశము లీడ్చుచునుండ శ్లేష్మమున్
ఘ్రాణగళాదిమార్గ మది ♦ కట్టఁగ నప్పుడు తోఁప దెద్దియున్
వాణియుఁ బైకిరాదు భగ ♦ వత్స్మృతి గల్గునె ? యిప్పుడే శ్రిత
త్రాణ మొనర్చు నీ యడుగు ♦ దమ్ములఁ గొల్చెద జానకీపతీ॥ 58

ఉ॥ ఎందఱి నాశ్రయించినను ♦ నెవ్వరు గూడరు వెంటరారు గో
విందపదారవిందసుప ♦ విత్రవర స్మరణామృతంబె మే
మొందఁ జరింతు మక్కడికి ♦ నేగి జరామరణాది దుఃఖమున్
బొందెదు రీతిఁ బాపి పరి ♦ పూర్ణసుఖంబిడు జానకీపతీ॥ 59

ఉ॥ తల్లియుఁ దండ్రియున్ గురువు ♦ దైవము సర్వము నీవె యంచు నే
నుల్లను రామ! నిన్ గొలుచు ♦ చుండెదఁ గావున నాదు చిత్తముం
దెల్లప్పుడింపుగాను వసి ♦ యించుచు నన్నుఁ బవిత్రుఁ జేసి నీ
యుల్లమునందు నక్షమణి ♦ యుంచుము నిత్యము జానకీపతీ॥ 60

ఉ॥ కోట్లకొలంది ద్రవ్యమును ♦ గూర్చుచునుండిన నేమిలాభమో!
చెట్లను జేమలందుఁ జలి ♦ చీమలు పుట్టలఁ బెట్టుచుండవే ?
యెట్లయినన్ సుకీర్తియుద ♦ యింపఁగ దానముఁ జేయకున్న నా
కొట్లధనంబు వ్యర్థమది ♦ కూడనువచ్చునె జానకీపతీ॥ 61

ఉ॥ అందఱి కన్నిరూపముల ♦ నన్నిమతంబుల కన్నిపేర్లతో
డెందములందుఁ దోఁచుచు న ♦ టింతువొకండవు కావె ? రామ నీ
యందు జగంబులుండుఁ బర ♦ మాత్మవు మూలవిరాట్టువయ్యు నీ
చందము యోగులైనఁ గనఁ ♦ జాలరు ప్రోవవె జానకీపతీ॥ 62

ఉ॥ చండకృశానుభాను ఘన ♦ చంద్రికళాధికపూర్ణతేజ కో
దండకరా భయారి హర ♦ దండధరాదిసురాధినాథ బ్ర
హ్మాండధురంధరుండవు చ ♦ రాచరమంతయు నిండియున్న నీ
యండను జేరినాఁడ నభ ♦ యంబిడి ప్రోవవె జానకీపతీ॥ 63

ఉ॥ ఒక్కఁడునవ్వుచుండ మఱి ♦ యొక్కఁడు ధారుణినేడ్చుచుండు వే
రొక్కఁడుపుట్టుచుండమఱి ♦ యొక్కఁడుచచ్చుచున్నుండు నెవ్వఁడీ
వొక్కనినెక్కచందమున ♦ నుంచవు నీకది చిద్విలాసమే ?
చిక్కులు పెట్టకయ్య కృపఁ ♦ జేసెదు స్వామివి జానకీపతీ ॥ 64

ఉ॥ నీవు సమస్తలోకముల ♦ నిల్వఁగబెట్ట దశావతారి వై
స్థావరజంగమంబులను ♦ సర్వముఁ గాచుచునుందువయ్య నీ
పావనసచ్చరిత్రములు ♦ పన్నగనాయకుఁడెన్నఁ జాలునే ?
దేవపరాత్పరా వరద ♦ దివ్యకళాలయ జానకీపతీ ॥ 65

ఉ॥ ఆవిధి నిద్రపోవ సక ♦ లాగమముల్ హరియించి సోమకుం
డావనధిన్ జరించి జల ♦ మందునడాఁగఁగ మత్స్యమూర్తివై
నీవపుడేగినీటను ము ♦ నింగి దురాత్మునివానిఁ జంపి వే
దావళిఁ దెచ్చియిచ్చితివి ♦ యట్టిఘనుండవు జానకీపతీ ॥ 66

ఉ॥ వాసుకిత్రాడు మందరము ♦ వాసిగఁ గవ్వముగా సమర్చి దే
వాసుర లబ్ధిఁజిల్కుతఱి ♦ నందు నగంబు మునుంగుచుండ మం
థాసనమాచుఁ గూర్మముగనై యమృతంబుదయించునట్లుగాఁ
జేసిన పుణ్యమూర్తివి ప్ర ♦ సిద్ధయశుండవు జానకీపతీ ॥ 67

ఉ॥ ఈక్షితిమండలంబు చలి ♦ యించి జలంబుల మున్గిపోవఁ ద
ద్రక్షణమాచరింపఁగ వ ♦ రాహమవై చని నీమొకొప్పె
నా క్షితినెత్తి బంతివలె ♦ నచ్చటనే నిలఁబెట్టి యా హిర
ణ్యాక్షునిఁ జంపిభూతలము ♦ నాపినవాఁడవు జానకీపతీ ॥ 68

ఉ॥ ఆ దనుజేంద్రుఁడౌ జనకు ♦ నైనఁ ద్యజించి విరాగియౌచు నీ
పాదసరోజముల్ పరమ ♦ భక్తిని నమ్మి భజించుచుండు ప్ర
హ్లాదునిఁ బ్రోవ స్తంభమున ♦ నప్పుడె శ్రీ నరసింహమూర్తివై
యాదితి పుత్రుఁజంపితివి ♦ యద్భుతమూర్తివి జానకీపతీ ॥ 69

ఉ॥ వామనమూర్తివై మధుర ♦ వాక్యములన్ బలిచక్రవర్తితో
"నో మహనీయ యీయఁదగు ♦ నాకను స్థలంబిదు" యంచు నల్లపూ
ర్వామరుఁడియ్య వానిఁ జెర ♦ మందుఁబడంచి విక్రమించి యా
బాములనెల్లఁ బాపితివి ♦ భద్రనగాలయ జానకీపతీ॥ 70

ఉ॥ రాజులఁ జంపఁగాఁ బరశు ♦ రాముఁడవై పితృశాసనంబుచేఁ
దేజము దర్పమున్ మెఱయఁ ♦ దీవ్రకుఠారనిశాతధారతో
నీజగమందు రాజకుల ♦ హింస నొనర్చియు నిర్వదొక్కమా
ర్లీజగతిన్ మహీసురుల ♦ కిచ్చిన దాతవు జానకీపతీ॥ 71

ఉ॥ కోమలమేఘగాత్ర వర ♦ కూర్మసుపృష్ఠపదాగ్ర ప్రోన్నస
త్తామరసోదరాంఘ్రితల ♦ తామ్రజపాకుసుమస్ఫురన్నఖా
కామమనోజ్ఞ కాహళని ♦ కాశమనోహరజంఘ దేవ శ్రీ
రామ భవత్కృపాంబునిధి ♦ రంగముఁ జూపవె జానకీపతీ॥ 72

ఉ॥ చారుగజేంద్రహస్త విల ♦ సన్మృదులోరుయుగా మృగేంద్ర మ
ధ్యా రమణీయకాంతి నిచ ♦ యాంచితసాంద్రవిశాలవక్ష రే
ఖారచనాఢ్యకంబునిభ ♦ కంఠ మహార్గళదీర్ఘబాహు ర
మ్యా రఘువంశపావన ద ♦ యన్ గనుచుండుము జానకీపతీ॥ 73

ఉ॥ బాలపలాశరమ్య మృదు ♦ పాణితలా స్ఫురదున్నతాంస జ్యో
త్స్నాలలితస్మితా విమల ♦ దాడిమబీజసమానదంత స
త్యాలయ మంజుభాష మధు ♦ రాధరపల్లవ సత్స్వభావ లీ
లాలసదంబుజాక్ష శుభ ♦ లక్షణ ప్రోవుము జానకీపతీ। 74

ఉ॥ ఆయతచారుకోమలఘ ♦ నావళినీలశిరోజ కార్ముక
భ్రూయుగళా మనోజ్ఞతిల ♦ పుష్పసమున్నతనాసికా ద్యుతి
శ్రీయుత సత్కపోలలలిత ♦ శీతలచంద్రమనోహరాననా
నాయెడ నీకృపాలత నె ♦ సంగొనఁ జేయుము జానకీపతీ॥ 75

ఉ॥ హేమకిరీటకోటిమణి ♦ హీరవిలాసితసన్ముఖాళకా
స్తోమసువర్ణకుండల సు ♦ శోభితకర్ణయుగా వరాంగదా
స్తోమ విచిత్రరత్నకలి ♦ తామల మౌక్తికహార రమ్య శ్రీ
రామ మనోజ్ఞవేష వడి ♦ రక్షింటు చూచెద జానకీపతీ॥ 76

ఉ॥ కాంచన పద్మరాగమణి ♦ కంకణభూషితపాణిపల్లవా
చంచలరత్నకాంతి విల ♦ సద్రశనాంచితసూక్ష్మమధ్య రే
ఖాంచల పీతవస్త్ర వివి ♦ ధాభరణార్చితపాదపద్మర
త్నాంచిత భూషణాఢ్య లలి ♦ తాంగుళి ప్రోవుము జానకీపతీ॥ 77

ఉ॥ శ్రీవిలసత్పవిత్రతుల ♦ సీదళచందన పుష్పభూషితా
పావనసద్గుణాభరణ ♦ భక్తివినమ్ర సమస్త భక్తసం
సేవితసుందరాంఘ్రిసర ♦ సీరుహ భక్తజనావన ప్రియా
కావుము రామ భక్తజన ♦ కామిత దాయక జానకీపతీ॥ 78

ఉ॥ వేదసమస్తశాస్త్రచయ ♦ వేద్యమహాగుణ షోడశోపచా
రాదిసమర్చితా సుహృద ♦ యా సుకవీశ్వరసంస్తుతిప్రియా
స్వాదుఫలాన్నభోగ ఘన ♦ వైభవ దానసుహృష్టమానసా
నీదు కృపాకటాక్షములు ♦ నిల్పుముమామొద జానకీపతీ॥ 79

ఉ॥ తుంబురు నారదాదులు ప్రశు ♦ తులొనరింగా భరతప్రవీణతర్క
దంబుఅమిరాటుచుండిము సు ♦ ధారసమొల్కఁగఁబాడుచుండి నృ
త్యంబునొనర్చిసాక్కీ దర ♦ హాసముఖుల్ నినుఁ జేయుచుండుకా
లంబుననుండు నీముఖవి ♦ లాసముఁజూపవె జానకీపతీ॥ 80

ఉ॥ ముద్దులుమూటగట్టు నగు ♦ మోమునఁదళ్కులుకుల్కుచుండఁగా
నొద్దికసొంపునింపు మధు ♦ రోష్ఠలు తేనెలఁ జిమ్ముచుండ మే
లద్దము బోలుచెక్కులుల ♦ హాసకళాంగన నాట్యమాడ నీ
ముద్దుమొగంబుఁ జూపుచుఁబ్రమోద మొసంగుము జానకీపతీ॥ 81

ఉ॥ దాశరథీ సుబాహుముఖ ♦ దైత్యహరా మునియజ్ఞరక్షకా
కౌశికదత్త దిగ్విజయ ♦ కారణదివ్యమహాస్త్రజాల గౌ
రీశధనుర్విభంజన మ ♦ హీశసుతాహృదయాబ్జభృంగ స
ర్వేశ చిదాత్మ రామ పర ♦ మేశ్వర కావుము జానకీపతీ॥ 82

ఉ॥ భానుకులాబ్ధిసోమ సుత ♦ భార్గవరామ మహోపరాక్రమా
మానవిభూషణా సుగుణ ♦ మండిత పౌరజనాభివందితా
యానకులాభిమాన సుత ♦ హోనరవాస్యం రామచంద్ర యీ
నేనొనరించు సత్కృతిని ♦ నేడు గ్రహింపుము జానకీపతీ ॥ 83

ఉ॥ వారితసర్వరాజ్య పితృ ♦ వాక్పరిపాలనసద్వ్రతైక ని
ష్ఠారత వీతరాగ విభ ♦ సన్మునివేష వినీతభావ సీ
తాగచిత్తోపచార కృతి ♦ దక్షిణలక్ష్మణసంయుతా జగ
త్కారణ రామభద్ర హిత ♦ కావు జితేంద్రియ జానకీపతీ ॥ 84

ఉ॥ దీనదయాపరా మహిత ♦ దివ్యకృపాలసన్ముఖాంబుజా
మానవరూప శాంతగుణ ♦ మండన త్యక్తసమస్తవైభవా
మానసరాజహంస వర ♦ మానసపుష్ఠ ప్రచండదండకా
కాననవాస దైత్యగణ ♦ ఖండన కావుము జానకీపతీ ॥ 85

ఉ॥ వానరరాజమిత్ర ఘన ♦ వారినిబంధన పండితా మరు
త్సూనభుజోపవిష్ట వర ♦ తూణశరాసన ముష్టిభూషితా
దానవవంశతూల ఘన ♦ దావనముజ్జ్వలదగ్నిహోత్రి కో
పానలదగ్ధదైత్య కరు ♦ ణామృత పేశల జానకీపతీ ॥ 86

ఉ॥ రావణ కుంభకర్ణులను ♦ రక్కసులన్ వధియించి జానకీ
దేవినిగూడి వేడ్క జల ♦ ధిన్ వడిదాటి సుఖంబుగా నయో
ధ్యావరరాజధానిని ఘ ♦ భాసనమందు వెలుంగుచుండి యా
గ్రావన భక్తరక్షణప ♦ రాయణ ప్రోవుము జానకీపతీ ॥ 87

ఉ॥ దుష్టులు దానవాంశజులు ♦ దుర్బల గర్వమునొందిభూమిపై
నిష్టమువచ్చినట్లు చరి ♦ యించి మహాత్ములఁ బాధపెట్టుచుం
గష్టము గల్గజేయఁగని ♦ గర్వున శ్రీబలరామమూర్తివై
ముష్టిక నాదురాత్ములను ♦ మొత్తితివచ్యుత జానకీపతీ॥ 94

ఉ॥ గోకులమందుఁ బుట్టియుఁ ♦ గొల్లల యిండ్లను వెన్నదొంగవై
పోరకునాటపాటలను ♦ బాగుగఁ జూపుచు గొల్లవారిపై
శ్రీకరమౌ కృపారసముఁ ♦ జిమ్మిన కృష్ణుఁడ నీవకాదె? రా
మాకృపజూచు దివ్యమహి ♦ మా నను బ్రోవుము జానకీపతీ॥ 95

ఉ॥ మున్నొకనాఁడు గంధమిడి ♦ మోదముతో నినువేడగానె యా
విన్నపమాలకించి కడు ♦ వేడ్క దానిని సుందరాంగియౌ
కన్నియజేసి కామమున ♦ కామిత మిచ్చియుఁ బ్రోచినట్టియా
వెన్నుఁడవీవకాదె? నిను ♦ వేడితి బ్రోవుము జానకీపతీ॥ 96

ఉ॥ ద్రౌపది మానభంగమున ♦ దిక్కు పరాత్పరయంచు వేడఁగా
నీవను మన్ననఁ గైకొని ♦ నీవు దుకూలములిచ్చి యామెనా
మానముదండి గాచితివి ♦ మాకరుణానిధి వీవుకాదె? నా
పాపముదేమొకాని చెవిఁ ♦ బట్టవునామొఱ జానకీపతీ॥ 97

ఉ॥ కొంచెముగూర్చి గుప్పెడటు ♦ కుల్ నిరుపేదకుచేలుఁడియ్య భ
క్తించి సమస్తమిచ్చి కృప ♦ చేసినకృష్ణుఁడవీవుకాదె? నీ
వించుకయైన నాస్థితి గ ♦ హింపవు పిల్చినబల్కవే? కటా
క్షించుటకై దినేశకుల ♦ శేఖర వేఁడెద జానకీపతీ॥ 98

ఉ॥ క్రూరులు దానవాంశజులు ♦ కుంభిని యందుదయించి వైదికా
చారగరిష్ఠులై పరులు ♦ చంపనశక్యులునై చరింపఁగా
వారికి నాస్తికపద్ధతుల ♦ వాదమునేరిపి బౌద్ధమూర్తివై
పేరుపుగావనించితివి ♦ నీసముఁడెవ్వఁడు జానకీపతీ॥ 99

ఉ॥ భూతలమందుఁ గల్కివయి ♦ పుట్టి తురంగము నెక్కి ఖడ్గము
జేతధరించి దుష్టులు న ♦ శింప ననించి సమస్తధర్మని
కేతవుసేచు శాంతిని ధ ♦ రిత్రిని నిల్పెదవవ్యయా పరం
జ్యోతి వసంతరూపుఁడ న ♦ ఖండవు బ్రోవవె జానకీపతీ ॥ 100

ఉ॥ శ్రీయుత శంఖచక్రతుల ♦ సీదళదామ విరాజితాంగ నా
రాయణ రామకృష్ణ పర ♦ మాత్మ నిజాశ్రితపారిజాత రా
మాయణ వర్ణనీయ మహి ♦ మా పరిపూర్ణకటాక్ష శ్రీజగ
న్నాయక శ్రీనివాస కరు ♦ ణానిధి బ్రోవవె జానకీపతీ ॥ 101

ఉ॥ మాధవ కేశవా దనుజ ♦ మర్దన పద్మదళాక్ష వామనా
శ్రీధర వాసుదేవ నర ♦ సింహ ముకుంద హరి జనార్దనా
సాధుజనావనా నిగమ ♦ సన్నుత పంకజనాభ విష్ణు లో
కాధిప రామచంద్ర పురు ♦ షార్థఫలప్రద జానకీపతీ॥ 102

ఉ॥ తొల్లి గజేంద్రుఁడా మొసలి ♦ తోడను బోరఁగ లేక దీనుఁడై
తల్లడమొంది పాహియని ♦ ధ్యానముఁ జేయఁగ వేగఁబోయి నీ
వల్లరిపుఁ వధించి యపు ♦ డాగజరాజును గాచినాఁడవే?
సల్లలితావతార నను ♦ జల్లఁగఁజూడుము జానకీపతీ ॥ 103

ఉ॥ రామ గుణాభిరామ రఘు ♦ రామ మనోహరనామ దేవ శ్రీ
రామ జగత్రయావనధు ♦ రంధర సాశ్రిత కల్పవృక్ష నీ
నామము లెల్లపల్కిన మ ♦ నస్సు సుఖించును రామచంద్ర నీ
నామము మోక్షదాయకము ♦ నాకుఁ బ్రియంబది జానకీపతీ ॥ 104

ఉ॥ దాసుని తప్పులన్ని యును ♦ దండముతో సరియన్న రీతి నా
దోసములెల్ల నీభజన ♦ తో సరి రాఘవరామ నేను నీ
దాసుఁడనయ్య నన్ మఱవ ♦ ధర్మము గాదిఁక ప్రేమయుంచి నీ
భాసురసత్కటాక్షములఁ ♦ బంపుము నాపయి జానకీపతీ ॥ 105

ఉ॥ నీచరణారవిందముల ♦ నిత్యముఁ గొల్చెడు భాగ్యమిమ్ము సీ
తాచకితాక్షికైరవసు ♦ ధాకర పాలితలోక భక్త ర
క్షాచరణైకచిత్త పవ ♦ నాత్మజసేవితపాదపద్మ భ
ద్రాచలరామ నాయక ♦ టాత్మమునుంచుము జానకీపతీ॥ 106

ఉ॥ రామపదంబు మంగళక ♦ రంబది సర్వసుఖప్రదంబు శ్రీ
రామనుబీజముల్ దురిత ♦ రాశిహరంబులు రాఘవేంద్ర నీ
నామము సంస్మరించెదు జ ♦ నంబుల కాపదలుండునే? పరం
ధామ భవత్ప్రసాదమున ♦ ధన్యుఁడనైతిని జానకీపతీ॥ 107

ఉ॥ సూర్యకులోత్తమా భువన ♦ సుందరవిగ్రహ శౌర్యధైర్య గాం
భీర్యదయావతంస రణ ♦ భీకర చండపరాక్రమాఢ్య సత్
కార్యధురంధరా సకల ♦ కామితదాయక రామ! అయ్యమా
చార్యసమర్చితాంఘ్రిజల ♦ జద్వయ ప్రోవుము జానకీపతీ॥ 108

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.





